# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మార్చి నెల 22 వ తేది శనివారం [నెం 1 రు.

## ఈ వారంలో యుద్ధం.

### విమానదాడి :

బ్రిటిషు విమానములు యీవారం జర్మను రేవులపైనను, పారిశ్రామిక పట్టణములపైనను తీవ్రతరమగు దాడిని సాగించినవి. 13 వ తేదీన బ్రిటిషు విమానదళం జర్మను ఆయుధ ఫ్యాక్టరీలుగల బ్రిమను పట్టణంపైన, నౌకల నిర్మించే హంబర్గుపైన, జర్మను రాజధానియగు బెర్లిను నగరంపైన, రాత్రి యంతయు వేలకొలది బాంబుల వర్షించెను. అచటి మంటలు 70 లేక 80 మైళ్ళ దూరంవరకు అగుపించుచుండెను. మరునాడుగూడ హాంబర్గుపై దాడిసలిపినవి. అంతేకాక ఉత్తరమున నార్వేపైన దక్షిణమున ఫ్రాంసు రేవు స్థలములగు కాలే, బోలోనుపైననుగూడ పగలే విమానదాడి జరిగెను. 15 వ తేదీన జర్మనీలో రూరుప్రాంతముల డుసెల్డార్ఫు పట్టణమునందలి ఫ్యాక్టరీలపైన బ్రిటిషు విమానములు అగ్నివర్షము కురిపించివచ్చినవి. ఐదు విమానములు మాత్రం తిరిగి రాలేదు.

సోమవారమునాడు బ్రిటిషు కోస్తా విమానములు ఒక పెద్ద శత్రువుల సప్లై నౌకపై బాంబువేసి ముంచివేసినవి. మరి కొన్ని విమానములు బ్రెమెన్, విల్హెల్ముషావెన్ పట్టణములపై చాల బాంబుల వర్షించినవి. మంగళవారమునాడు తిరిగి ఆ పట్టణములతోపాటు కీలురేవుపైనగూడ బ్రిటిషు విమానములు వందలకొలది బాంబుల వర్షించివచ్చినవి. రాటర్డాం పట్టణమునగల ఒక శత్రువుల పెట్రోలు గిడ్డంగి తగులబడి పోయెను.

బుధవారము రాత్రి బ్రిటిషు విమానములు, జర్మనీయందలి కలోను పట్టణముపైనను, ఇతర పారిశ్రామిక పట్టణములపైనను భయంకరమగు దాడులు సాగించెను. బ్రిటిషు బాంబులచే చాల ఫ్యాక్టరీలు శిథిలమైనవి. రాటర్డాంనందుగల నూనె గిడ్డంగులును, మూడు విమానాశ్రయములును ధ్వంసమొనర్చబడెను. లోరియంటునందుగల శత్రు జలాంతర్గాముల కేంద్రమునుగూడ బ్రిటిషు విమానములు తీవ్రమగు దాడిని జరిపినవి. ఈ దాడినుండి ఒక్క విమానంమాత్రం తిరిగిరాలేదు.

ఇటీవల కొన్ని నెలలుగా బ్రిటనుపై జర్మనులు తీవ్రమగు విమానదాడులు సాగించలేదు. కాని గత బుధవారంనుండి రాత్రింబవళ్లు తీవ్రమగు దాడి సాగించుచుండిరి. పశ్చిమ రేవుపట్నములపైన, మిడ్లండ్సు, లండనుపైన ఎక్కువగ కేంద్రీకరిస్తున్నారు. మెర్సిసైడు, క్లైడుసైడు రేవుస్థలములపైన దాడికి వందలకొలది జర్మను విమానాలు వచ్చినవి. శుక్ర, శనివారములందు బ్రిటను అన్నిప్రాంతములపైన రాత్రి దాడులు విరివిగా సాగించెను. ఆదివారం రాత్రి బ్రిస్టలు పట్టణంపైన అతి తీవ్రమగుదాడి సాగించెను. ఈ దాడిలోమాత్రం చాల మంది మరణించిరి. బ్రిటిషువారు క్రొత్తరకం విమాన విధ్వంసక ఫిరంగులను ఉపయోగిస్తున్నారు. వీనివలన, ఫైటరు విమానాలవలన శత్రువిమానాలను బుధవారం 9, గురువారం 13, శుక్రవారం 5 బ్రిటనులో పడగొట్టిరి. రాత్రి దాడులందిన్ని విమానాలను పడగొట్టుటకు యిదియే ప్రారంభము.

12, 13 వ తేదీలలో మెర్సిసైడుపై జరిగిన విమాన దాడులవలన ప్రజలలో 500 మంది హతులైరి. మరి 500 మంది క్షతగాత్రులైరి. క్లైడు ప్రాంతముపై 13, 14 వ తేదీలలో జరిగిన దాడులలో 500 మంది హతులైరి. 800 మంది క్షతగాత్రులైరి.

మంగళవారమునాడు బ్రిటిషు కోస్తాపైన రెండు శత్రు విమానములు పడగొట్టబడెను. నాటిరాత్రి హల్లు రేవు పట్టణముపై జర్మను వైమానికులు తమ దాడిని కేంద్రీకరించిరి. కొంత ఆస్తికి నష్టముకల్గెను. కాని విమాన ధ్వంసక ఫిరంగులు ఆకసమంతయు అగ్నిగోళముతో కప్పివేయుటవలన, శత్రుల ఆటలు తలచినంతగ సాగలేదు. ఒక విమానము పడగొట్టబడెను. బుధవారము సాయంత్రము చీకటిపడిన పిమ్మట, శత్రులు, లండనుపై తీవ్రమగు విమాన దాడిని సాగించి బాంబుల వర్షించిరి. నాలుగు వైద్యశాలలకు నష్టముగలిగెను. ఒక వైద్యశాలలో 1,200 రోగులుండిరి. కాని కొలదిమందికి మాత్రమే బాంబులవలన దెబ్బలు తగిలెను. ఈ సంవత్సరం లండనుపై జరిగిన దాడులన్నిటిలో యిదియే పెద్దది. కాని పోలీసులు, అగ్నిప్రమాదములను నివారించుటకుద్దేశింపబడిన ప్రత్యేక దళమువారు వెంటనే మంటల నార్పివేయుటచే ఆస్తి నష్టము చాల తగ్గెను.

### ఆఫ్రికా : మధ్యధరా సముద్రం.

ఉత్తరాఫ్రికాయందు ఇటలీవారి ట్రిపోలీ రేవుపై బ్రిటిషు విమానాలు యీ వారం రెండుసారులు దాడిసల్పినవి. తూర్పు ఆఫ్రికాయందు బ్రిటిషు సైన్యములు ఇటలీ రాజ్యము నెక్కువభాగ మాక్రమించెను. 17 వ తేదీన అదివరకు ఆగస్టులో గోల్పోయిన బెర్బరా నగరమును బ్రిటిషువారు తిరిగి వశపరచుకొనిరి. ఇరిట్రియాలో కెరేను ప్రాంతమున యింకను పోరాటం జరుగుచున్నది. త్వరలోనే కెరేనువద్ద ఇటాలియను ప్రతిరోధము తొలగును.

బ్రిటిషు విదేశాంగమంత్రియగు ఈడెనుగారు ఈజిప్టుప్రధాన మంత్రిని కలుసుకొని సంప్రదించెను. ఈజిప్టు ప్రధాని తమదేశం బ్రిటనుకు బాసటకై నిలచునని ప్రకటించెను. ఇటలీవారి రోడ్సుదీవులపై బ్రిటిషు విమానములు బాంబులు వర్షించెను.

ఎరిట్రియాలో ఇటాలియనులు, బ్రిటిషు సైనిక పంక్తులపై తిరిగి దాడులు సల్పుచు, బ్రిటిషు పురోగమనమును తగ్గించుటకు ప్రయత్నించుచున్నారు. కాని బ్రిటిషు సైన్యములు, ఎరిట్రియా రాజధానియగు కెరెన్ నగరమును క్రమముగా అన్ని వైపులనుండియు చుట్టుముట్టుచున్నవి.

అబిసీనియాలో ఆగ్నేయ ప్రాంతమునగల యవలో పట్టణమును అబిసీనియా సైన్యములు 19 వ తేదిన ఆక్రమించినవి. ఆ వెనుకటి రోజున జిజిగా పట్టణమును బ్రిటిషు సైన్యము లాక్రమించెను. దీనివలన డిరెడవానుండి తూర్పున బర్బరా వరకును నిరాఘాటముగ సైన్యములు రాకపోకలు జరుపుకొనుటకు బ్రిటిషువారికి మార్గము యేర్పడును.

## అమెరికా, అట్లాంటికు.

అధ్యక్షుడు రూజువెల్టుగారు 16 వ తేదిన గావించిన ఉపన్యాసములో నియంతలను పూర్తిగ ఓడించుటకవసరమగు సహాయాన్నంతా అమెరికా చేస్తుందని ప్రకటించాడు. అందుకవసరమగు ఆయుధ నిర్మాణంకోసం అతడడిగిన 700 కోట్ల డాలరులను శాసనసభోపసంఘం వారా పొందించిరి. ఈ మొత్తం బ్రిటనుకు కావలసిన వర్తక నౌకలు, యుద్ధ నౌకలు, విమానాలు ఆయుధ సామగ్రి తయారుచేయుటకు వినియోగింపబడుతుంది. బ్రిటనుకొరకు 500 వర్తకనౌకలు నిర్మించుటకుగూడా ఏర్పాటుగలదు. అదిగాక అరువు కవులు చట్టం క్రింద అమెరికానుండి ఇంగ్లాండునకు విమానాల ఎగుమతి గూడ అపుడే ప్రారంభమైనది. విమానాలకు అవసరమగు "ఏవియేషను నూనె" పెట్రోలు మొదలగు చమురు ఇంగ్లాండునకు, బ్రిటిషు సామ్రాజ్య దేశములకు ఎగుమతి చేయుటకు అమెరికా అంగీకరించెను. మరికొన్ని ప్రాత డిస్ట్రాయరులు (యుద్ధనౌకలు) బ్రిటనుకు పంపే విషయం ఆలోచనలో యుంది.

తూర్పున అట్లాంటికు మహాసముద్ర తీరమునందును పడమట శాంత మహాసముద్రమునుగూడ ఒకే సమయమున శత్రుబాధలు సంభవించినను, కాపాడుటకు తగినంత యుద్ధనౌకా బలమును నిర్మించుటకుగాను యునైటెడు స్టేట్సు సెనేటువారు ప్రభుత్వమునకు 344 కోట్ల 70 లక్షల డాలర్లను మంజూరుచేసిరి.

## ఇటలీ—గ్రీసు.

ఆల్బేనియాలో గ్రీకుసైనిక పంక్తులను వెనుకకు నెట్టుటకు గతవారం ఇటలీ సైన్యం చేసిన ప్రయత్నములన్నియు విఫలమయినవి. ఏ ప్రాంతమునందైన ఒక గజమైన ముందుకు పోజాలక పోవుటయేగాక, 15,000 మందిని గోల్పోయి, మరికొన్ని వేలమందిని గ్రీకులకు ఖైదీలుగ ఒప్పగించవలసి వచ్చెను. టెఫెలెనీ ప్రాంతమున ఇటలీ తన బలమునంతా కేంద్రీకరించినను పదునైదు మైళ్ల వెడల్పు యుద్ధరంగమున ఏడు రోజులు హోరాహోరి గ్రీకులతో పోరాడిన పిమ్మట, ఇటలీ పటాలములు శిథిలములై వెనుకకు మరలి పోవలసివచ్చెను. గ్రీకులు కొంతముందుకు రాగల్గిరి. సోమవారంనాడు ఇటలీ సైనికులు నిరుత్సాహంచెంది దాడి తగ్గించిరి. 3 వేలమంది ఇటలీ సైనికులు ఖైదీలుగ పట్టుబడిరి. ఉత్తర భాగమున ప్రాగ్రడేజు, మొాల్లే, సుంబీనదీ ప్రాంతములలోగూడ గ్రీకు సైనిక పంక్తులపై ఇటాలియనుల దాడులన్నియు చాలనష్టముతో తిరుగ గొట్టబడినవి.

ఇటాలియనులు బ్రహ్మాండమగు ప్రయత్నంచేసి గ్రీకు సైనిక పంక్తులపై సాగించిన దాడి సంపూర్ణంగా విఫలమగుటయేగాక, పిమ్మట గ్రీకులు ఎదిర్చినపుడు నిలువరించుకొనుటకుగూడ దుర్బలులై పారిపోవుటకు ప్రారంభించిరి. గ్రీకు సైన్యములు 20 వ తేదీ ఉదయం టెపిలీ పట్టణమును ప్రవేశించినవి. వెలోనా రేవునకు జను మార్గమునగల పట్టణములలో నిదియే చివరది. వెలోనా రేవుగూడ గ్రీకు వశమగుచో, ఇక ఇటాలియనులు ఆల్బేనియాకు సైన్యమును పంపుటకుగాని అచ్చటినుండి తెచ్చుకొనుటకుగాని ఒక్క రోజా రేవు మాత్రమే మిగిలియుండును. టెపెలీని ఆక్రమించినపుడు గ్రీకులకు చాల మందు గుండుసామానుగూడ చేజిక్కినది.

## బాల్కనులు.

జర్మనీకి మధ్యధరా సముద్రములోనికి ప్రవేశములభించుటకు బాల్కను రాజ్యములు అడ్డంగానున్నవి. వీటిని తన చెప్పు చేతలలో నుంచుకొనుటకు హిట్లరు ఎత్తులు విఫలమగుచున్నవి. జర్మనులు మూడు లక్షల సైన్యమును బల్గేరియాయందు దించిరి. దానిని టర్కీ సరిహద్దునందు, గ్రీసు సరిహద్దునందు నిలుపుచుండిరి.

యుగోస్లావియా ప్రధానమంత్రియు, విదేశాంగ మంత్రియు జర్మనీతో మైత్రి యొడంబడికను గావించుకొనుటకుగాను, జర్మనీకి వెళ్లనని చెలుపబడెను. కాని వారందుకు పోలేదు. జర్మనీ, యుగోస్లావియా స్వాతంత్ర్యమునకు భంగకరమగు షరతులు సూచించినందున, యుగోస్లావియా వాటిని నిరాకరించెననియు, తన స్వాతంత్ర్యమునకు అనుగుణ్యంగా షరతులను సూచించెననియు వదంతులు వ్యాపించుచున్నవి.

ఈలోగా యుగోస్లావియా ప్రభుత్వం సైన్యాలనుకూడ సమీకరించుచు, స్వాతంత్ర్య రక్షణకు సిద్ధమగుచున్నట్టి ప్రధానమంత్రిగ పనిచేసిన స్టోయడినొవిచ్‌గారు, యుగోస్లావియానుండి వెడలిపోయి గ్రీసులో ప్రవేశించిరి. ఇతను జర్మనీకి అనుకూల పక్షములలో నొకరు.

విదేశాంగమంత్రి ఈడెనుగారు, మంగళవారమునాడు టర్కీ విదేశాంగమంత్రియగు సారజోగోలుగారిని ప్రత్యేకముగ ఆహ్వానించి సైప్రెస్‌నందు ఉభయులు, మధ్య ప్రాచ్యమున యుద్ధ పరిస్థితులగురించి దీర్ఘముగ సంప్రదించిరి. సమావేశానంతరము సారజోగులుగారు ప్రయాణమై వెడలుచు, బ్రిటను-టర్కీల ధృఢమగు స్నేహభావమును ధృవపరచుచు ఉభయదేశములకును, అన్ని విషయములయందును సంపూర్ణమగు ఏకీభావముగలదని ప్రకటించెను.

జర్మను సైన్యములు గ్రీసుపై నింకను దాడి ప్రారంభింపలేదు. కాని అందుకు బల్గేరియాలో జర్మనులు సన్నాహముల పూర్తిచేయుచున్నారు. జర్మను సైనిక విమానదళములు బాల్కను నైసర్గిక పరిస్థితుల కలవరచుకొనుట కేర్పరుచుకొనిన సైనిక విన్యాసములలో, బల్గేరియా రాజగు బోరిస్‌గారును, ఇతర ప్రభుత్వాధికారులునుగూడ పాల్గొనిరి.

## తూర్పున జపాను అలజడి.

జాపాను, జర్మనీ, ఇటలీలు యిదివరకే అన్యోన్య సహకార ఒడంబడికను చేసుకొనియున్నవి. ఇపుడు జాపాను విదేశాంగమంత్రి మట్సుఓకగారు యూరోపునకు ప్రయాణమై రషియా సరిహద్దున గల అట్పొరే పట్టణమునకు చేరిరి. మాస్కో మీదుగా బెర్లినునకు 27 వ తేదిన చేరి తరువాత రోమునకుకూడ బోయెదరు. వీరేమిసాధింపబోయిరో చూడవలసియున్నది.

చీనా ప్రభుత్వ ఆయుధనిర్మాణశాలలు బర్మాలో నున్నవనియు, అందుచే బర్మాపై జాపాను విమానదాడి సలుపవలసియున్నదనియు ఒక జాపానుపత్రిక హెచ్చరించుచున్నది. తమ కర్మాగారము లేవియు బర్మాలో లేవని చీనాప్రభుత్వం వెంటనే ప్రకటించి, యీవార్తను ఖండించెను.

చీనాయందలి జపాను అధికారులు హూపేరాష్ట్రమున గల టుంగుచెంకు ప్రాంతమునందలి తమ సైన్యమును మరలించుకొనిరి. సైనిక సౌకర్యములకొరకు ఆప్రాంతం ఖాళీ చేసితిమనిరి. చీనా సైన్యములు ఆప్రాంతములను ఆక్రమించినవి. ఇచాంగ్ రేవు పట్టణమునకు పడమటి ప్రాంతమున చీనా సైన్యములకును జపాను సైన్యములకును నాల్గు రోజులు యుద్ధం జరిగినపిదప చీనావారు జపానువారిని వెనుకకు నెట్టివేసిరి. 16 వ తేదిన చైనీయులు క్వాంగుటుంగు రాష్ట్రమునయున్న క్వాంగై పట్టణమును పరిసరప్రాంతమును ఆక్రమించిరి. జపానీయులు కియాంగ్సి రాష్ట్రమున గల తెలిగ్సిన్ పట్టణము నాక్రమించితిమని ప్రకటించిరి.

## విషీ ప్రభుత్వం.

జర్మనీచే ఆక్రమింపబడగా మిగిలిన ఫ్రాంసుదేశ భాగములకు ఆహారపదార్థములు అమెరికానుండి తెప్పించుకొనుటకు అనుమతించవలసినదిగా విషీ ప్రభుత్వం కోరెను. అక్కడికిగాని, హాలెండు, బెల్జియం మొదలగు శత్రువులచే ఆక్రమింపబడిన దేశములకుగాని ఆహారపదార్థములను పోనిచ్చుచో అవి జర్మనీకే చేరుననియు, అట్లు పంపక దిగ్బంధము నేమాత్రము సడలింపరాదనియు ఇంగ్లాండు ప్రకటించెను. 15 వ తేదిన అమెరికాలో ఇంగ్లాండు ప్రతినిధియగు హాలిఫాక్సు ప్రభువును, అమెరికా మంత్రి కార్డెలుహల్లుగారును యీ విషయంలో సంప్రదించుకొనిరి. అమెరికా నిరాకరించుచో కర్తవ్య మాలోచించుటకు విషీ (ఫ్రాంసు) ప్రభుత్వ కార్యవర్గము 15 వ తేదినే సమావేశమయ్యెను.

ఆ యాహారపదార్థములు ఫ్రాంసునుండి జర్మనుల చేతులలో పడకుండజూచు పద్ధతిని ఉగుమతులకు అనుమతి నొసగుటకు బ్రిటిషు అధికారులు అంతగ నాక్షేపించుటలేదు.

### జర్మనీ ఆక్రమించిన దేశాల క్షోభ.

జర్మనీ ఆక్రమించిన దేశాలలో ప్రజలకు బాధలు ఎక్కువగుచున్నవి. ఆ దేశాలలో ప్రజలు నిర్బంధంగా జర్మనీ ఉపయోగంకొరకై పంటలు ఎక్కువ పండించి, తమకు లేకుండా వారికి పంపించవలసియున్నది.

జర్మనీ ఆక్రమించిన నార్వే సాలీనా 680 లక్షల పౌనులు (అనగా తలకు 25 పౌనుల చొప్పున) సాలీనా జర్మనీకి చెల్లించవలసియున్నది. డెన్మార్కు 260 లక్షలు, బెల్జియం 750, హాలెండు 540 లక్షలు, ఫ్రాన్సు 8,270 లక్షలు పౌనులు చెల్లించవలసియున్నవి. నార్వేలో ప్రభుత్వానికి యుద్ధం పూర్వం వచ్చు రాబడిలో 1/3 వంతు యిచ్చివేయుచున్నది. అన్ని దేశాలకన్న యీ దేశం ఎక్కువభారం వహించుచున్నది. పోలండు, జకోస్లోవికియా, రుమేనియా, బల్గేరియాదేశములు ఎంత చెల్లించుచున్నవో లెక్క తెలియదు.

## నౌకా నష్టములు.

వసంత ఋతువురాగానే, తన జలాంతర్గాములతో నౌకాయుద్ధం సాగించెదనని హిట్లరు ఇటీవల ప్రగల్భాలు పలికియున్నాడు. అది గతవారం ప్రారంభమైనట్లుంది. వెనుకటి యొనిమిదివారములకంటె ఆవారం నౌకానష్టం 140 వేల టన్నులకు హెచ్చినది. ఇది గత మహాసంగ్రామములో 1917 వ సంవత్సరమున బ్రిటిషు నౌకానష్టముకంటె చాల తక్కువ. మార్చి 9, 10 తేదీలకు ముగిసినవారమున నౌకానష్టము 98,832 టన్నులకు తగ్గినది. వీనిలో బ్రిటిషు నౌకలు 20. మిత్రమండలివి 5.

ఈమాత్రము నష్టమునుగురించిగూడ బ్రిటిషు అధికారులు ఆదుర్దాపడుచు నివారణోపాయములగురించి తీవ్రముగ నాలోచించుచున్నారు. అట్లాంటికు సముద్రమున బ్రిటనుకువచ్చు సరకుల నౌకల ముంచివేయుటకు జర్మనులు యుద్ధనౌకలను విమానములనుగూడ ఉపయోగించుచున్నారనియు మూడు శత్రుజలాంతర్గాములు ముంచివేయబడెననియు చర్చిలు ప్రధాని ప్రకటించుచు, త్వరలోనే నౌకలకు శత్రుభయమును అరికట్టగలమను దృఢవిశ్వాసమును ప్రకటించెను.

బ్రిటిషుప్రభుత్వమువారు వర్తకనౌకలతోబాటు యుద్ధనౌకలనుగూడ యునైటెడుస్టేట్సు రేవులలో నిర్మించుకొనుటకు యునైటెడ్‌స్టేట్సు ప్రభుత్వమువారి అనుమతిని కోరిరనియు, యునైటెడ్‌స్టేట్సు ప్రభుత్వమువారీవిషయము నాలోచించుచుండిరనియు యునైటెడ్‌స్టేట్సు అధికారులు వెల్లడించిరి.

జర్మనులు క్రొత్తగ నిర్మించుకొనిన "బ్రెమెన్" అను 51 వేల టన్నుల నౌక అగ్నిజ్వాలలలో తగులబడిపోయినది. ఇదిగాక యునైటెడ్‌స్టేట్సు నౌకా నిర్మాణశాలలలో తాముగూడ యుద్ధనౌకల నిర్మించుకొనుటకు అనుమతి యొసగవలెనని బ్రిటిషు ప్రభుత్వమువారు యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వమును కోరిరి.

త్వరలోనే అట్లాంటికు మహాసముద్ర ప్రాంతము పెద్ద నౌకా యుద్ధరంగమగునని, బ్రిటిషు ప్రధాన మంత్రి చర్చిలుగారు 18 వ తేదిన ప్రకటించిరి. జర్మనులు ఫరాసుతీరపు రేవులను కేంద్రముగ నిడుకొని అచటినుండి జలాంతర్గాములను యుద్ధ నౌకలను, విమానములను అట్లాంటికు సముద్రముపైకి పంపుచున్నారు. వీనితో బ్రిటనుతో రాకపోకలు జరుపు మిత్రమండలి నౌకలపై దాడులు సాగించుట శత్రుల యుద్దేశముకాని ఈ యుపద్రవమును బ్రిటిషు ప్రభుత్వము జయప్రదముగ నిరోధింపగలదనియు అపుడే మూడు శత్రు జలాంతర్గాములు ముంచివేయబడెననియు ప్రధాన మంత్రి ప్రకటించెను.

# ఆఫ్రికా యుద్ధము, బ్రిటిషువారి విజయగాథ.

## ఆఫ్రికాలో బ్రిటిషువారి గెలుపు.

ఉత్తర తూర్పు ఆఫ్రికాలయందు గత నాల్గు మాసముల యుద్ధములో బ్రిటిషువారు గెలిచిన అంశములు :

సిరినైకా యనబడు లిబియాలోని తూర్పు భాగము ;

ఇటాలియను సోమలీలాండులో ఒక లక్ష చదరపు మైళ్లు ;

అబిసీనియా వాయువ్య దిక్కున చాల భాగము ;

ఇరిట్రియాలో పెక్కు ముఖ్య నగరములు ;

లిబియా యుద్ధంలో 1,40,000 ఇటాలియను ఖైదీలు.

సోమలీలాండులో ఇటలీ నష్టం : 21,000 చనిపోయినవారు, బందీలైనవారు చేరి.

లిబియాలో వశమయిన ఫిరంగులు : 1,200 ఇటలీ సోమలీలాండులోగూడ, 1,200 ఫిరంగులు దొరికినాయి.

కిస్మాయులో పట్టుపడిన ఇటలీ నౌకలు ఐదు-మొత్తం 28,000 టన్నులు. మరో ఐదు యితరత్ర పోయినవి.

ఆఫ్రికాలో ఇటలీ నష్టపడిన విమానాలు 1,000.

ఇరిట్రియాలో నాశనం చేయబడిన ఇటలీ విమానాలు 120.

ఇవిగాక—అనేకం ఆయుధ మోటారులు, టాంకులు, పెద్ద ఫిరంగులు, విమానాలను కొట్టే తుపాకులు, చిన్న తుపాకులు, చిన్న టాంకులు, రవానా లారీలు, ఆహార పదార్థములు, చమురు యితర విధములగు సరకు యీ యుద్ధంలో విశేషంగా పట్టుబడ్డవి.

ఈజిప్టు, సూయజుకాల్వ, ఎర్రసముద్రం, ఇండియా దేశాలకు యిపుడు ఇటలీదాడి భయం తొలగిపోయింది.

ఎందుచేత ?

ఆంతోనీ ఈడెనుగారు 1940 వ సం॥ నవంబరులో ఈజిప్టునకు పోయినపుడు చర్చిలు ప్రధాని తన విదేశమంత్రి ద్వారా వావెలు సేనానికి ఎక్కువ సైన్యం కోరవలెనని కబురంపెను. వావెలు సేనాని కోరెను. ఆ ప్రకారం క్రొత్త సైన్యం పంపబడెను.

తూర్పునుండి, పడమరనుండి అన్ని రకముల సైన్యము, టాంకులు, ఫిరంగులు, మందుగుండు, అంతేకాక బాగా తరిఫీదయిన ఆస్ట్రేలియా, న్యూజీలండు సైనికులు ఇంగ్లాండు నుండి ఇండియానుండి వచ్చిపడ్డారు.

ఈజిప్టుపై పట్టు విడిపించి, ఆఫ్రికాలోని ఇటలీ సామ్రాజ్యమును పడగొట్టు కార్యము డిసంబరు 7 వ తేదిన ప్రారంభమయినది. అందు ప్రథమాంకం సరిగా రెండు నెలలకు ముగిసెను. ఫలితం—ఈ లిబియాలో తూర్పు భాగమగు సిరినైకా బ్రిటిషువారి చేజిక్కింది.

ఇది ఎట్లా జరిగింది ?

అతి స్వల్ప నష్టంతో అత్యద్భుతమగు సైనిక విజయము వావెలు సేనాని నిపుణనాయకత్వం, దూరదృష్టి, ధైర్యసాహసములవలనను, బ్రిటిషు నౌకాదళం రాయలు విమానదళం కాల్బలముల సమిష్టి సహకారములవలనను చేకూరినది. ఈ విచిత్రగాథ యీ దిగువరీతిని గలదు :—

## లిబియా.

బ్రిటిషు సేనలు డిసంబరు 7 వ తేదిన మిర్సమాట్రూ రైలుమార్గమును విడచి, అతి రహస్యంగా ఎడారిలోనికి ప్రవేశించి, కొన్నితావు లాక్రమించేయి. ఇటలీ వశమందున్న లిబేనియాను ఆక్రమించుటలో ఇండియా సేనలు చాల ప్రాధాన్యత వహించాయి. బ్రిటిషు విమానాల సహాయాన, తీవ్రయుద్ధం జరిగినాక, యీ స్థలం పట్టుబడింది. 10 వ తేదిన బ్రిటిషు సేనలు నాల్గువైపులనుండి దాడి ప్రారంభించినాయి. సిడిబరాని నగరాన్ని అన్నివైపులనుండి ముట్టడి చేసి, పడమటి ఎడారిలో ప్రథమ విజయమును చేకూర్చినవి. ఆయుధాలతోపాటు 35,000 మంది ఖైదీలు పట్టుబడిరి.

తరువాత కాపుజా వశమయ్యెను. సోలుం ప్రాంతమున ఇటలీవారిని చెండాడుటతో ఈజిప్టునుండి వారు పూర్తిగ తరిమివేయబడినట్లే. లిబియాలో యుద్ధం ప్రారంభమయి, యిరువది దినములు బార్డియానగరం ముట్టడి జరిగెను. ఇచటగూడ రాయలు విమానాలు, యుద్ధ నౌకలు సకాలమున తోడ్పడినవి. జనవరి 5 వ తేదిన బార్డియా లొంగిపోయెను. 44,868 మంది ఇటలీ సైనికులు ఖైదగుటో, చనిపోవుటో జరిగెను. ఫిరంగులు, విమానవిచ్ఛేదపు తుపాకులు మున్నగు పరికరాలెన్నో లభించాయి.

లిబియా లోభాగం 100 మైళ్ల దూరానయున్న టబ్రుకు నగరం తరువాతది. బార్డియా పడకముందే యిక్కడికి బ్రిటిషువారి ఆయుధ మోటారులు టాంకులు, పంపబడినవి. జనవరి 22 వ తేదిన టబ్రుకు వశమయినది. 20,000 ఖైదీలు దొరికారు. ఇప్పటికి ఇటలీ సేనానియగు మార్షలు గ్రేజియానిగారి దళంలో 2/3 వంతు పోయింది. నేడతడు రోమునగరంలో ఖైదీవలెయున్నాడు.

ఒకవారం గడిచేక చిన్న రేవు డెర్నాయు, 40 మైళ్ల దూరానయున్న అపోలోనియా చేచిక్కినవి. తదనంతరం, గ్రేజియానిగారు ఈజిప్టుదాడికి అనుకూలకేంద్రంగాయుంచుకున్న సిరేనీలోకి బ్రిటిషు సేనలు ప్రవేశించేయి. ఇటనుండి 130 మైళ్ల దూరానవున్న బెంగాజీపైకి రెండు ప్రక్కరోడ్లమీదుగ బ్రిటిషు సేనలు దాడివెళ్లి, మూడు రోజులు పోరి ఆ ముఖ్యరేవు స్థలం తీసుకున్నవి. టబ్రుకు గెలిచేక వావెలు సేనాని తన సేనను రెండుగ విభజించి ఒకటి తీరపు మార్గాన పడమరనున్న డెర్నా సీరీనల వైపు, మరొకటి మచిలీగుండా లోభాగమున 90 మైళ్ల దూరమునకు పంపెను. ఈ సైన్య సంచారం అతిరహస్యంగ జరిపించెను. ఒక దళం ఇటలీ సైనికులకు మార్గంలేకుండా చేసినది. ఈలోగా, అకస్మాత్తుగా దెబ్బకొట్టుటకు ప్రఖ్యాతిబడసిన ఆస్ట్రేలియా సైన్యం బెంగాజీపై బడెను. ఆ రేవును అదే సమయాన, నౌకాదళం విమాన దళం గూడ ముట్టడి చేయుచుండెను. శక్తి తప్పి నిరాశచెందిన ఇటలీ సైనికులు ఎదిరించి పోరకుండానే బెంగాజీని వశంచేసిరి. బెంగాజీ మధ్యధరా సముద్రంలో ప్రధాన స్థలం. మాల్టాకు 360 మైళ్ల దూరంలోనుంది. విమానాశ్రయాలు, నౌకాశ్రయములు గలవు.

స్వతంత్ర ఫ్రెంచి సేనలు చాడ్‌నుండి బయలుదేరి బెంగాజీకి 500 మైళ్లు దక్షిణానగల కుఫ్ర వశపరచుకొన్నవి. ఈ ఎడారి లంకయందు ఇటలీవారివి ముఖ్యమగు విమానాశ్రయములు గలవు.

## ఇరిట్రియా.

ఇరిట్రియాలో ఖసాలానుండి కరేనువరకు అద్భుతమైన దాడి జరిగెను. తూర్పు ఆఫ్రికాలో ముసోలోని విమాన దళం పూర్తిగ తుడుచుకపోయింది. 120 బాంబరులు, ఫైటరు విమానాలు విరిగి కుప్పలుగా పడియున్నవి. ఇటలీవారి తూర్పు ఆఫ్రికాలో బ్రిటిషువారి మొదటి దాడి, గలాబటు తిరిగి వశపరచుకొనుటతో 1940 వ సం॥ నవంబరు నెలలో ప్రారంభమైనది. అపుడు ఇటలీవారు అబిసీనియా సరిహద్దున మెటమ్మావరకు తరిమివేయబడిరి. ఖసాలా జనవరి 18 తేదిన ఖాళీచేయబడింది. 110 మైళ్ల దూరాననున్న అగోరడటువరకు ఇటలీ సేనలు తిరిగి చూడకుండా పారిపోయాయి. బ్రిటిషు సేనలు అతివడిగ వారిని వెంటతరిమి అగోరడటునుగూడ ఫిబ్రవరి 1 వ తేదిన చేజిక్కించుకొన్నవి. మరునాడు బరాంటు తీసుకొన్నవి. సిడీబరానీ సైన్యంలో అత్యద్భుతంగా ప్రవర్తించారన్న కీర్తిగాంచిన భారతీయ సైన్యం, యిచటకూడా ప్రశంసార్హమగు ధైర్యంతోను, వడిగాను పనిచేసెను. సిక్కులు, రసపుత్రులు, గార్వాలీలు, పంజాబీ సైనికులు, ఇంజనీర్లు, సేపర్లు, మైనర్లు గొప్పగా యుద్ధంచేయబట్టి, వేవలు సేనాని ఒక ప్రత్యేక సందేశములో వారిపని ఉత్కృష్టమయినదని కొనియాడెను. అస్మారాకు 70 మైళ్ల దూరానవున్న కరేను నగరంపై ఉత్తరం-తూర్పు-దక్షిణముల నుండి ముట్టడి జరుగుచున్నది. ఇది పడిపోయినచో బ్రిటిషు సేనలు అస్మారాకు అటనుండి ఎర్ర సముద్రం రేవగు మస్సావాకు పోగలవు.

బ్రిటిషు సోమాలిలాండు ముఖ్యపట్నమగు బెర్బారాను ఆదివరకు ఇటలీ సైన్యం వశపరచుకొనెను. దానిని యీ వారంలో బ్రిటిషువారు తిరిగి వశపరచుకొన్నారు. యుద్ధ నౌకలనుండి బ్రిటిషు సైనికులు దిగి తీరమునుండి వచ్చుచున్న శత్రు ఫిరంగిగుండ్ల నెదుర్కొని, ఆ నగరమును వశపరచుకొనిరి. దీనితో గోల్పోయిన స్థలములన్ని తిరిగి వశపరచుకొన్నట్లే. బ్రిటిషువారు గెలిచిన ప్రతిచోట వందలువేలు ఖైదీలను పట్టుకొనుచున్నారు.

### అబిసీనియా.

తానా సరస్సునకు వాయువ్యదిక్కున వేలకొలది చదరపు మైళ్లు ఇటలీ అధికారంనుండి తప్పించబడినది. అబిసీనియా చక్రవర్తి హెయిలి శెలాసీగారు, తన ప్రాత సేనాధిపతి రాసు ఖాసాగారితోగూడ బ్రిటిషు సేనల సహాయాన, ఈ ప్రాంతాలలో పోరాడుచున్నారు. గోండారు రోడ్డుపై సేనలు పోవుచున్నవి. అబిసీనియను దేశాభిమానుల సైన్యం బూరీపుర మాక్రమించి, డెబ్రమార్కోసు వైపు పారిపోవుచున్న ఇటలీ సైన్యమును వెంటాడుచున్నది. అబిసీనియా పడమర భాగమునన్న అసోసా నగరముపైకి రెండు మార్గములగుండా రెండు బ్రిటిషు సేనలువచ్చి వశపరచుకొన్నవి. సుడాను సైన్యం అఘోడను వశపరచుకొన్నది. అబిసీనియా సైన్యం యవెల్లోను పట్టుకొనెను. ఇటలీ సోమలిలాండునుండి వచ్చుచున్న బ్రిటిషు సేన డగబరు (జిగ్జిగాకు 100 మైళ్లు) పైబడి చాలమందిని ఖైదుచేసెను. సామ్రాజ్యసేనలు ముఖ్య కేంద్రమగు హరారుపై విజయయాత్ర చేయుచున్నవి. ఈ రీతిగ అబిసీనియాను అన్ని వైపులనుండి చుట్టివేయుచున్నారు. రాయలు విమానాలు చాల సహాయం చేస్తున్నాయి. ఇటలీ సైనికులు 1,700 మంది పారిపోయిరి. అడిస్సు అబాబాపైబడుట కెంతోకాలం పట్టదు. అది యిపుడు ఇటలీ ఖైదీల శిబిరంగానుంది. అందుండిన అబిసీనియా దేశీయులందరు దూరాన వేరొక క్రొత్త పూరనుంచబడిరి. అబిసీనియాలో తమకు రాజ్యకాంక్ష లేదనియు, ఇతోపియా రాజ్యం తిరిగి రాసుటిఫారి చక్రవర్తి వశం కావాలనియు, బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించియుండిరి. ప్రస్తుతమాత్రం చక్రవర్తి సైన్యానికి బ్రిటిషు సైనికులు అధికారులుగనుండి నడిపించక తప్పదు. యుద్ధం ముగిసేక ఆర్థిక రాజకీయ విషయములందు, సంధి నియమముల ననుసరించి యెంత వరకు సహాయ మవసరమో అంతసహాయం బ్రిటిషువారు ఒసంగెదరు.

### ఇటాలియను సోమలిలాండు.

ఇటాలియను సోమలిలాండులో జుబానదినుండి వెబిషు బులువరకుగల భాగం అంతా బ్రిటిషువారివశం అయింది. ఫిబ్రవరి 15 వ తేదిన కిస్మాయు రేవును వశపరచుకొన్న దక్షిణాఫ్రికా సైన్యం, వేలకొలది ఖైదీలను పట్టుకొనెను. అచటికి 150 మైళ్లలోనున్న బ్రవాను పడమర ఆఫ్రికా సైన్యం వశపరచుకొంది. ఈ రాజ్యం ముఖ్యపట్నమగు మగడిషు నగరం మరునాడు దక్షిణాఫ్రికా సేనలకులోబడెను. మార్చి 7 వ తేదిన ఫెర్ ఫెర్, 9 వ తేదిన గాబ్రిడరి ముఖ్య నగరం చిక్కినవి. ఇటలీ సైన్యం రెండుగా చీలి భిన్న మార్గముల ఉత్తరంగా పరారు చిత్తగించింది. బ్రిటిషు నౌకాదళం యీ యుద్ధంలో చాల తోడ్పడుటచే పెక్కు ఇటలీ నౌకలు వశమయి, మరికొన్ని తమంతతామే మునిగినవి. ఇటలీకి "ప్రియమైన వలస రాజ్యాలలో నివాసయోగ్యమగు తీరస్థలం అంతా బ్రిటిషువారి వశమయింది. ఇంకా యుద్ధం కొనసాగుచున్నది. నానాటికి క్షీణించు ఇటలీ సైన్యం ప్రమాదావస్థలోనున్నది.

## అధ్యక్ష రూజువెల్టుగారి అభయం.

## డిక్టేటరులకు హెచ్చరిక.

అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు నియంతలకు (డిక్టేటరులకు) హెచ్చరిక తెల్పుచు, వారి ఒత్తిడికి నలుగుచున్న ఇంగ్లాండు, గ్రీసు, చీనా, దేశములకు అమెరికా సహాయంచేయ దృఢనిశ్చయం కల్గియున్నదని తెల్పుచు, గంభీరోపన్యాసంగావించిరి. 1940 వ సం|| జూనులో ఫ్రాంసుపడిపోయిన తరువాత యింత గొప్పమగువార్త వినబడలేదు. చరిత్రాత్మకమగు యీ ప్రకటనవలన యీ దిగువ విషయములు స్పష్టమయినవి :—

(1) దురాక్రమణం నిరోధించుటకు అమెరికా ఎంతేని కృషిచేయును.

(2) ప్రపంచమంతటను స్వాతంత్ర్య రక్షణమునే అమెరికా మన స్ఫూర్తిగ కోరుచున్నది.

(3) ప్రజాప్రతినిధి ప్రభుత్వములకు తోడ్పడు యత్నమున అధ్యక్షుడు రూజువెల్టుగారికి 13 కోట్ల అమెరికా ప్రజలు బలముగనున్నారు.

(4) యుద్ధఫలితంగూర్చి ఎట్టి సందేహం యుండదు.

"డిక్టేటరుల పాలన అతిత్వరలో అంతరించాలని ప్రార్థించుచున్నాము. అటుతరువాత జరుగనున్న ప్రపంచ పునరుద్ధరణమునందు మనదేశం పూర్తిగ పాల్గొనును. ఎంత చిన్న దేశానికైన స్వతంత్రంగా సురక్షితంగా జీవించుటకు హక్కుగలదని నమ్ముచున్నాము." అని రూజువెల్టుగారన్న మాటలు స్వాతంత్ర్యేచ్ఛగల ప్రపంచ నివాసులందరికి ప్రోత్సాహకరంగా నుండగలవు.

### అమెరికా కర్తవ్యం.

తమదేశపు శాసనసభయగు కాంగ్రెసులో ఆమోదించబడిన అరువు కవులుచట్టం ఫలితంగా అమెరికా చేయగల కార్యములగూర్చి రూజువెల్టుగారు యిట్లు తెలిపిరి :

"గత మహా సంగ్రామసమయమున అమెరికాలో ప్రజలకు ఐకమత్యంలేదని, జర్మనులకు యిచటనున్నవారి ప్రతినిధులు తెలిపియుండిరి. నియంతలు యిపుడు మన ఐకమత్యంగూర్చి సందేహింపజాలరు. మనజాతి ఐకమత్యంగలదనియు, ప్రస్తుత ప్రమాదమును గుర్తించి ప్రత్యక్షచర్యకు గడంగుచున్నామనియు, యీ వారంలోని ప్రధానవార్త ప్రపంచానికి చాటినది.

"ఈ నూతన చట్టం ఒకేవ్యక్తి అభిప్రాయం తెలుపుట లేదు. పదమూడుకోట్ల ప్రజాభిప్రాయముగ ప్రకటింపబడి అమలు జరుపబడుచున్నది. ఇక ప్రపంచానికి ఎట్టి సందేహం ఉండ నవసరంలేము. తక్కువ లాభాలకు, ఎక్కువ పన్నులకు, దీర్ఘకాలం పని, మున్నగు త్యాగాలకు ప్రజలు సిద్ధపడాలి. అమెరికా యిదివర కెన్నడెరుంగనంత పడిగా ఉత్పత్తి చేయును. 15 లక్షల అమెరికనులు సైన్యంలో చేరియున్నారు. సమ్మెలవలన కుట్రలవలన అమెరికా పట్టుదల కుంటువడరాదు. ప్రస్తుతముప్పును గుర్తించుటచేతనే నిస్సందేహముగ, వెన్వెంటనే బ్రిటను గ్రీసు చీనాలకును, దుండగీండ్రచే ఆక్రమింపబడిన యితర దేశములన్నింటికిని, అన్ని విధములగు సహాయంచేయుటకు నిశ్చయించితిమి."

### నియంతలకు హెచ్చరిక.

నియంతలవలన ప్రపంచానికిగల్గు ప్రమాదమునుగూర్చి తెలుపుటలో రూజువెల్టుగారు ఎట్టి మోమోటంపడలేదు. వారిమాటలివి :—

"నాజీ సైన్యాలు యూరోపు రాజ్యాల సరిహద్దులను మార్చి, నేలనాక్రమించు ఆశతోమాత్రమే యుద్ధంలో దిగలేదు. ప్రతీదేశంలోను, మన దేశంలోగూడ, ప్రతినిధి ప్రభు

త్వ విధానములను రూపుమాపి, బలంగల కొద్ది మంది చెప్పుచేతులలోనుండు ప్రభుత్వం స్థాపించదలచుచున్నారు. దీనినే నూతన పద్ధతి అంటున్నారు. ఇది నూతనం కాదు, పద్ధతి కాదు. బలవంతుల ఆధిపత్యమును, బానిసత్వమును మానవకోటి ఎల్లకాలము సహించదు.

"రాజీమార్గమునకు కాంగ్రెసు నిర్ణయం స్వస్తి చెప్పింది.

"పాలకజాతి పవిత్రతయని నియంతలు చెప్పే ప్రగల్భాలన్ని వట్టిబూటకం, యేహ్యమైనవి. తోడిమానవులపై అధికారం చెలాయించడానికని ఏ ఒకజాతి పుట్టలేదు, పుట్టబోదు. తన వైశాల్యము, సైనికశక్తి అవకాశంగాగొని యితర దేశాలు, జాతులపై సంపూర్ణాధికారం చెలాయించాలని జూచు జాతిని ప్రపంచం సహించదు."

## ప్రజా ప్రతినిధి రాజ్యాలు.

ప్రజా ప్రతినిధి ప్రభుత్వాల భావి స్థితినిగూర్చి రూజువెల్టుగారు యిట్లు తెలిపిరి :—

"1939-40 వ సంవత్సరములలో యూరోపు దేశాలను పడగొట్టు కార్యక్రమం నియంతల ఉద్దేశం ప్రకారం కొనసాగింది. కాని అజేయులగు బ్రిటిషువారి దరిచేరుసరికి ఆపని నిలచిపోయింది. ప్రజా ప్రభుత్వములను అణచవేసి వాటి శత్రువులు గుర్తించి స్వరక్షణకై పాటుబడవలసియుండును

"ప్రజాప్రభుత్వ జ్యోతిని ఆరనీయకూడదు, కోట్లకొలది ఇంగ్లీషువారు దానిని దారుణ గాలిదుమారమునుండి కాపాడుచున్నారు. ప్రజాప్రభుత్వ విధానం విఫలమయినచో వాక్స్వాతంత్ర్యం, దైవభక్తి, సంతృప్తి, ధైర్యం అందరానిపండ్లగును."

## బ్రిటిషువారి ధైర్యం.

బ్రిటిషువారి ధైర్య సాహసములు, నిలువరించుకొను శక్తిని గూర్చి అధ్యక్షుని ప్రశంస యిట్లు గలదు :

"గత పది నెలల విషాదమును అత్యంత ఓర్పుతో సహించగల ధైర్య స్థైర్యములు బ్రిటిషువారికి గలవు. సామ్రాజ్య దేశములన్నింటియొక్క, స్వాతంత్ర్య వాంఛగల ప్రపంచ నివాసులందరియొక్క సహాయ సానుభూతులువారికి గలవు. రేపో, వారానికో, నెలకో బ్రిటనుపై దాడికి వారు సిద్ధముగనేయున్నారు."

అని చెప్పి బ్రిటిషు ప్రధాని చర్చిలుగారిని అధ్యక్షుడు మిగుల కొనియాడెను.

## అమెరికా సహాయం.

యుద్ధమునందు అమెరికా సంపూర్ణ సహాయం ఎట్లు చేయనున్నదో వివరంగా అధ్యక్షుడు తెలిపియుండెను :—

"మనం పంపగల ప్రతి విమానం, యుద్ధ పరికరములు క్రొత్తవి ప్రాతవి అన్నియు పంపబడును. మన ఉత్పత్తి అత్యధికము చేయబడును.

"పరిశ్రమలలో తయారగు సరకు యుద్ధరంగానికి చేర్చే యేర్పాటు చేయాలి. మన సహాయం సగం సహాయం కాదు, సంపూర్ణ సహాయమని నేడయినను తెలియగలదు."

చట్టం సంతకమైన వెన్వెంటనే కొంతసరకు పంపబడినదనియు, యింకను క్రొత్తవి అతివడిగా తయారు చేయబడుచున్నవనియు, వడియే ప్రధానంగా నెంచుచున్నామనియు తెలిపిరి.

అతి వడిగా, అతిదూరం పోగల నాల్గు ఇంజనుల విమానాలు, నాలుగైదు ఫిరంగులుండునవి, పెద్ద బాంబులు వేయగలవి అనేకం క్రొత్త రకముల విమానాలు అమెరికా తయారుచేయించి ఇంగ్లాండునకు పంప నిశ్చయించినది. "ఎగిరే కోట" అనునది అందొక క్రొత్త రకం విమానం.

## బెర్బెరా తిరిగి వశమగుట.

బ్రిటిషు సోమాలిలాండు ముఖ్యపట్నమగు బెర్బరా నగరంపై తిరిగి యూనియను జాకుపతాకము యెగురుచున్నది. ఆ నగరంలో ఇటలీ పరిపాలన మూణ్ణాళ్ల ముచ్చటైంది. ఫ్రాంసు పడిపోగానే ఇటలీ మిత్రమండలికి ప్రతికూలంగా యుద్ధంలో దిగినతోడనే, ఆఫ్రికాలోను చేరువ ప్రాచ్య దేశములలోను పరిస్థితులు మారే అవకాశం యేర్పడింది. అప్పటికి బ్రిటిషు సోమాలిలాండులో ఇంగ్లాండు చిన్న పోలీసు దళమును మాత్రముంచియుండెను. అందుచే, తన సేన అంతకన్న చాలపెద్దది కనుక సులభంగా బ్రిటిషు సోమాలిలాండును ఆక్రమించవచ్చునని ముసోలిని తలంచెను. బ్రిటిషు సేన ఖాళీచేసిపోయెను. దాంతో ముసోలిని భట్రాజు గయుడా, "బ్రిటను పని ముగిసింది. ఇంక దాని రక్షించే దిక్కులేదు" అని వాగేడు. "బ్రిటిషు సామ్రాజ్య విధ్వంసం యింకతప్పదు. బ్రిటిషు నౌకాదళమునకు, ఎర్ర సముద్రమునకు ప్రవేశముండదు" అని రోము రేడియో చాటెను. కొంతకాలంవరకు, అపుడప్పుడు సోమాలి తీరాన నౌకలదాడిమాత్రం ఇంగ్లాండు చేయగల్గుచుండెను. వావెలు సేనాని లిబియాలో మెరపుదాడి ప్రారంభించి, మార్షలు గ్రేజియానిపై విజయపరంపర పొందినపుడుగాని, సోమాలి రాజ్యమున తాను గోల్పోయిన భాగములను తిరిగి తీసికొనుటకు ఇంగ్లాండునకు అవకాశం చిక్కలేదు. నౌకాదళం, విమానదళం ఉపయుక్తమగు దాడులు జరిపినపిమ్మట 1941 వ సం॥ మార్చి 16 వ తేది ఆదివారం బ్రిటిషు సేనలు బెర్బరా యందు ప్రవేశించి ఆ పురి నాక్రమించినవి. తొలి రాత్రియే యుద్ధనౌకలు ఆ సేనలను అచటదింపినవి. కావున మధ్యధరా సముద్రము "ఇటలీ సరస్సు" కాదనియు, బ్రిటిషు నౌకలు సముద్రాలను యింకను యేలుచున్నవనియు రుజువైనది.

బెర్బెరా పునరాక్రమణతో ఇటలీకి మిగిలియున్న తూర్పు ఆఫ్రికా సామ్రాజ్యమునందలి గుండెకాయవంటి అడీసు అబాబా నగరమునకు ముప్పు యెక్కువైనది. అబిసీనియా ముఖ్యపట్నమగు ఆ నగరంపై బ్రిటిషు సేనలు పదమూడు కేంద్రములనుండి వచ్చి పడుచున్నవి. హరారు, దిరిడావాల యందలి ఇటలీ కేంద్రములపైగూడ దాడి నిశ్చయం.

కెరేనువద్ద ఇటలీవారు బ్రిటిషుదాడిని ఎదిరించి నిలువరించుకొన గల్గుచున్నారు. కెరేను పడిపోయినచో ఇటలీ ఇరిత్రియాను కోల్పోయినట్లే. అంతేకాదు, ఇటలీ ఆఫ్రికా సామ్రాజ్యమంతా పోయినట్లే. అస్మారాకు కెరేనుకు లంకె గలదు. అస్మారా ఇటలీకి ప్రధానసైనిక కేంద్రం. కెరేను పడమరను లోతైన కందకంవంటి రక్ష

గలదు. అందుకనే వావెలు సేనాని తన సేనను (అందు భారతీయులుగూడ గలరు) నగరం చుట్టు నిలిపి సముద్ర మార్గమున కెరేనుకు యెట్టి సహాయం రాకుండా చేసి, పురం పై దాడి సలుపునపుడు తనకు యెక్కువ నష్టం కలుగకుండా చూచుకొనుచున్నారు. అందుచే ఉత్తరమునుండి కెరేనుకు వచ్చుచున్న బ్రిటిషు దళము ఇటలీ సైన్యమును ప్రక్కనుండి కొట్టుటకు వీలగును. కెరేనులోని ఇటలీ సేనలు నిరాశ చెందుచున్నవని యిటీవలి వార్తలు తెల్పుచున్నవి. బ్రిటిషు సామ్రాజ్య సేనల నెదుర్కొనుటలో ఇటలీవారి నష్టం నానాటికి హెచ్చుచున్నది.

## బాల్కను రాజ్యములు.

బ్రిటిషు విదేశాంగ మంత్రి ఈడెనుగారు చేరువ ప్రాచ్య దేశములకు స్వయంగా పోవుటయు, రూజువెల్టు అధ్యక్షుడు అరువు-కౌలు చట్టమును అత్యంత వడిగ అమలు జరుపుటయు, బాల్కను రాజ్యములందు ఉత్సాహము కల్గించెను. ఏకాకి అయిపోయిన యుగోస్లావియా యింతవరకు నాజీ బెదరింపులకు లొంగక, జర్మనీవలలో పడుట కిష్టంలేదని స్పష్టపరచెను. యుగోస్లావియా ప్రధాని, విదేశాంగ మంత్రియు తమ దేశ స్వాతంత్ర్యాన్ని ధారబోయుటకు సంతకం చేయ బెర్లిను వచ్చుచున్నారనియు, వారిని తెచ్చుటకు జర్మను సైనిక విమానం యుగోస్లావియా ముఖ్యపట్నమగు బెల్గ్రేడునకు చేరెననియు, యీ వారం మొదట్లో నాజీలు నమ్మకం కలిగేటట్లు ప్రకటించేరు. కాని యుగోస్లావియా మంత్రులు కదలనేలేదు. బ్రిటిషు రాయబారి సకరోనాల్డు కాంబెలుగారు యుగోస్లావియా ప్రధానితో ఎంతోసేపు మాట్లాడ కలిగియుండిరి. కాని జర్మను రాయబారి ఎన్నిసారులో బెల్గ్రేడులో విదేశాంగ మంత్రి కార్యాలయానికి పోయినా, అతననుకున్న పని జరిగినట్లులేదు. సలోనికి గ్రీసు దేశంలో రెండవ ప్రధాన రేవుస్థలము. ఆయువుపట్టువంటిది. తన స్వాతంత్ర్యమునకు భంగం కలుగునను కారణమున సలోనికాను జర్మను లాక్రమించకుండా యుగోస్లావియా జూచుచున్నది. జర్మనీ యెంత సైన్యమును యీ ప్రాంతములకు పంపగలదను విషయం పై, బాల్కను దేశాల భావిస్థితి ఆధారపడియుండును. టర్కీ దిట్టతనం యుగోస్లావియాకు ధైర్యం కొల్పుచున్నది. హిట్లరు పంపిన సందేశం టర్కీకి అనుమానం పోగొట్టలేదు. అందుకే సర్వదా సిద్ధంగా వుంటున్నది. గ్రీకుల విజయంకూడా యుగోస్లావియాకు ప్రోత్సాహమొసగుచున్నది. గ్రీకులు చాల కష్టపడుచున్నారు; కాని యీ వారం అల్బేనియాలో ముసోలినీ స్వయంగా నడిపించిన దాడినిగూడ వారు యెదిరించి వెనుకకు నెట్టిరి. యుద్ధాన్ని బాల్కను రాజ్యాలకుగూడ జర్మనీ ప్రాకించుచున్నదని రషియా బహిరంగంగా నిందించడం కూడా యుగోస్లావియా నియంతలు నిరోధించుటకు ప్రోత్సాహమొసంగెను. జర్మనీ దాడిసల్పినచో తాము తప్పక ఏరీతి సహాయం చేయుదురో ఈడెను, సర్ జాను డిల్లుగార్లు యుగోస్లావియా పెద్దలకు తెలిపియుందురు. జర్మనీ ఇటలీలు తమ మిత్రులకు, కాబోయే మిత్రులకు బెదరింపులు, ఆశలు బుజ్జగింపులు బాహాటంగా ప్రకటించుటకు వెనుదీయవు. బ్రిటిషు ప్రభుత్వం వారు మాత్రం తమ మిత్రులకు ఏరీతిగా సహాయం చేయుదురో బయటకు చెప్పక, శత్రువుల ఊహకు విడచుచున్నారు. టర్కీ జర్మనీతో యుద్ధానికి దిగినచో రషియా తాను జోక్యం కలిగించుకోనని టర్కీకి అభయమిచ్చినట్లు తెలియుచున్నదిగాని, యీ వార్త రూఢికాలేదు.

---

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.